మల్లయ్య్య, బూసం

క్షయవత్సరనిరసనము

చెన్నపురి, 1927

Record no. 235

## Bibliographic Record Target

మల్లయ్య, బూసం.

క్షయవత్సరనిరసనము / బూసం మల్లయ్య.- చెన్నపురి : పమ్మి త్యాగరాయసెట్టి అండ్ సన్సు, 1927.

16 p. ;13 cm.

Record no. 235

Mallayya, Būsaṃ.

Kṣayavatsaranirasanamu / Būsaṃ Mallayya.- Cennapuri : Pammi Tyāgarāyaseṭṭi aṃḍ Sansu, 1927.

16 p. ;13 cm.

Record no. 235

ఓమ్.



# క్షయవత్సర నిరసనము.



ఇయ్యది

శ్రీయుత. బూసం - మల్లయ్యగారిచే రచియింపంబడి,

శ్రీయుత. తేళ్ల - చినకోటయ్యగారి కుమారుడు,

బసవయ్యగారి యొక్క

ద్రవ్య సహాయముచే,

---

చెన్నపురి: ప్రాతచాకలపేటయందుండు,
పమ్మి - త్యాగరాయసెట్టి అండు సన్సు గారి
శ్రీరాజరాజేశ్వరీ నికేతన ముద్రాక్షరశాలయందు
ముద్రింపించి ప్రకటింపం బడెను.

**18—8—27.**

# క్షయవత్సర నిరసనము.

1832 - సం॥

1—ఉ॥ నందన వత్సరం బొకటి
నాఁడుచెలంగి సమస్త జీవులన్,
గొందల మందజేసి బహు
ఘోరముగా నసువుల్ హరించి న,
ట్లందరు పెద్దలెల్లరును
హా భయమయ్యెడి నీవుగూడ నా,
చందమున న్మెలంగితివి
చాల్ క్షయవత్సరమా పిశాచమా.

1857 - సం॥

2—చ॥ ఘనతరమైన తొంపలు ప్ర
గాఢతమంబగు గాడ్పులన్విభీ,
షణముగ పేర్చి సర్వము ప్ర
శస్తముగా దహించి పూర్వమే,
చనియెను రాక్షసా న్వయము
సార్థకమై తగు వత్సరంబునీ,
మనికియు నట్లదోఁచె చను



మాక్షయవత్సరమా పిశాచమా.

1864 - సం॥

3—ఉ॥ రూక్షముగా జెలంగి విత
రుల్ భయమంద గఘోరవృత్తిదు,
ర్భిక్షము జూపిజీవతతి
ప్రేతకదంబముగా నొనర్చియు,
గ్రాక్ష విలోకనంబుల జ
నావళి నేర్చి కలంచినట్టి ర,
క్తాక్షిక్రమంబు బూనవుగ
దా క్షయవత్సరమా పిశాచమా.

1876 - సం॥

4—ఉ॥ కట్టభుజింప గాటకము
గల్పనజేసి వసింపనీక న,
ల్గట్టుల బోరద్రోలి కడ
గండ్లన నేకముగూర్చి పేర్చి య,
ట్టిట్టనరాని ఛిద్రముల
నేర్చి జనంబుల ధాతవత్సరం,
బట్టులఁ జేయనెంచితివె
హా క్షయవత్సరమా పిశాచమా.

5—ఉ॥ మత్సరముల్ భ్రమత్తతియు
1887- మాంద్యము ఘోరము క్రూరకృత్యముల్,
సం॥ కుత్సితబుద్ధులన్ జనుల
కు స్పృహాళింబుగ గల్గజేసితా,
నుత్సహమంది పోయెనట
నుగ్రతరంబగు సర్వజిత్తు సం,
వత్సరమాక్రియ న్దలతువా
క్షయవత్సరమా పిశాచమా.

1891 - సం॥
6—చ॥ ధరగల సర్వసస్యముల
ధగ్ధముజేసి జలంబుద్రాగ నే,
కరవుగ జేసి బిందువుల
గార్చెడి మేఘము మారుతాహతిన్,
మరలగ జేసి జీవులను
మాడ్చిచనెన్ ఖరవత్సరంబు నీ,
సరణియు నాక్రియన్వరలె
చాల్ క్షయవత్సరమా పిశాచమా.

1914 - సం॥
7—ఉ॥ కొండలమందు వర్తకుల



గూటికి బేదల జేసి బేరముల్,
ముందె నశింపజేసి ధన
ముల్ ఘనబ్యాంకుల మాటుచేసియా,
నందకు వత్సరంబుచ నే
నాక్రియనీవు జరింపనేల నీ,
చందము క్షీణవృత్తిగన
జాల్ క్షయవత్సరమా పిశాచమా.

1918 - సం॥
8—చ॥ జ్వరమును ప్లేగు రోగమును
సర్వజనంబుల మీదద్రోసి మం,
దిరముల వీడ జేసి కడు
నేర్పున బ్రాణములూడదీసి సు,
స్థిరముగనిల్చి తాండవము
జేసి కలంచిన కాళయుక్తి న,
త్సరమువిధంబు పూనవుగదా
క్షయవత్సరమా పిశాచమా.

1918 - సం॥
9—చ॥ క్రమముగ నెల్లవారికి న్నవ
రాజ్యముపై నొకయానగొల్పి క,

పృముల నిరాకరించెడి ప్ర
 భావముగూరిచి కృష్ణజన్మ ధా,
మమునకుబంపి బాధలిడి
 మాడ్చిన దుర్మతి వత్సరంబు నే
మము దలపెట్టనేల చను
 మా క్షయవత్సరమా పిశాచమా.

1925 - సం॥

10—ఉ॥ ప్రాణులు భీతిజెందగ న
 భంగురలీల నకాలమందె జం,
ఝూనిలఘోర శంబహతి
 సర్వదిశల్ నడలించివృక్ష సం,
తానము రూపడంచి చన
 దద్దయు క్రోధన వత్సరంబు నీ,
యానము నాక్రియ న్దలతు
 హా క్షయవత్సరమా పిశాచమా.

11—ఉ॥ మంకుదనంబుతో నధిక
 మానముతో ఘన తామదైత్యుతో
కింకరపాళితో మిగుల
 కీడొనరించెడి భేదబుద్ధితో,





శంకయొకింతలేక రభ
 సంబున భూమికివచ్చినావు నీ,
వంకనునిల్వలేము చనవా
 క్షయవత్సరమా పిశాచమా.

12—ఉ॥ శ్రీకరమైన బేరములు
 చిత్రముగా దిగజారెసర్వ నీ,
రాకరముల్ రసాతలము
 నంటగ బారు సమస్తజీవుల,
శ్శోక విపత్పరం పరల
 క్రుక్కి తపించుట మేరమీరె నీ,
రాకకతంబున న్గదధ
 రా క్షయవత్సరమా పిశాచమా.

18—చ॥ మొదటనె పేద సాదలకు
 ముప్పుఘటించితి వంతకంతకున్,
ముదిరిమదించి మొట్టితివ
 మోఘధనాఢ్యుల సర్వసంపదల్,
ప్రిదిలినశింప నెట్టితివి
 పెట్టనిబాధలు లేవునీవు కీ,
డొదవె భయంబు గల్గెచనుమా

క్షయవత్సరమా పిశాచమా.

14—ఉ॥ వానల దూలగొట్టితివి
పచ్చని పచ్చిక నెల్ల దిక్కులన్,
మానక నెండగట్టితివి
మానవకోటికి వింతరూపముల్,
జానుగ దెచ్చిపెట్టితివి
జంతులనాకట నీరువట్టులన్,
న్యూనతగూర్చి నెట్టితి వ
హో క్షయవత్సరమా పిశాచమా.

15—ఉ॥ పేదలు భీతిజెంద పశు
బృందము బందెల గుందవృక్షగు,
ల్మాదులు నాశమొంద గవ
ర్నవులుగుల్ దిగులొంద నార్చి క్ర,
వ్యాదులు మోదమొంద ఘన
వర్తకులెల్లరు డింద నెట్టియా,
హ్లాదమునీకు గల్గెనో
హో క్షయవత్సరమా పిశాచమా.

16—ఉ॥ సన్నుతి జేయఁగాదగు ప
సందగు కార్తులయందు వర్షముల్,



మున్నరయొనర్చినావు కన
జోద్యముగూర్చు ప్రసూన వల్లరుల్,
మున్నె నశింప జేసితివి
ముష్కర వృత్తి జరించినంతనీ,
కన్నులుచల్లనౌను పిడు
గా క్షయవత్సరమా పిశాచమా.

17—ఉ॥ ప్రాకటలీల నీళ్లుగల
పట్టునధాన్యము ధాన్యమెంతయో,
చాకగనుండు పట్టున ప్ర
శస్త జలంబులు నాస్తిజేసి చీ,
కాకుగడించి మానవుల
గాల్చుచునుంటివి శాంతమూనియా,
పోకడ లెల్లమాని యిక
పో క్షయవత్సరమా పిశాచమా.

18—ఉ॥ ఎన్నఁగ బూర్వవత్సరము
లెల్లనుగొన్ని నశింపఁజేసి న,
న్గొన్ని ప్రవృద్ధి జేసి చన
గుంభిని నీవటుగాక సర్వముల్,
నన్నము జేయుచుంటివి ప్ర

చారమునాను మొ కేవిధంబుగా,
నున్నదిచాలు నింక చను
మో క్షయవత్సరమా పిశాచమా.

19—ఉ॥ కొందఱ ద్రావనీళ్లకయి
కొందఱ సాపడ నోగిరంబుకై,
కొందఱగట్ట జీరకయి
కొందఱ గోముఖపాళిమేతకై,
అందఱ నన్నిభంగుల ల
యంబొనరింప దలంచినావు నీ,
చందము రూపుమాసి చన
చాల్ క్షయవత్సరమా పిశాచమా.

20—ఉ॥ ఎప్పుడు చూతునో సురల
నీభువిపోయిన రాకగల్గునో,
తప్పునో వచ్చినప్పుడె ప్ర
తాపము జూపక యేగనేల నే,
పొప్పగనిప్పుడే ప్రజల
నేర్చెదనంచు దలంచితేమొ నీ,
మొప్పితనంబు చాలు చనుమో
క్షయ వత్సరమా పిశాచమా.





21—చ॥ ఇసుకప్రదేశ మందు వసి
యించెడివారు జలంబులేక నా,
యసట మునుంగుచుండి రన
నయ్యరయొశైల సమీప భూమియే,
వసతిగనుండు వారలకు
పానముసేయ జలంబదెట్లు నీ,
వ్యసనము కాలిపోను చన
వా క్షయి వత్సరమా పిశాచమా.

22—చ॥ ప్రకటితలీల నీకవిలి
వర్తకసంఘము పాలమేల్మివై,
నకనకలాడి నేసెడి జ
నంబులపాలన కాలమారివై,
సకలము పర్వమంగళము
నల్ప పిశాచమువైతి వింక నీ,
తికమక లెల్ల జాలును ప
దే క్షయ వత్సరమా పిశాచమా.

23—ఉ॥ పేరును గీర్తియుంగల వి
వేకులుసైతము నీదు భీకరా,
కార ప్రవర్తనంబున వి

కావికలై చనుచున్నవార లూ,
రూరికి యింక నేకరణి
నుండఁదలంచితి వీవుమా యొడన్,
భూరి కృపాంతరంగ వయి
పోక్షయ వత్సరమా పిశాచమా.

24—ఉ॥ చూడసమస్త మానవుల
శోకముగుండెలు వ్రీలుచెప్ప నో,
రాడదుస్వీయ సంతతిని
అమ్ముచు నుండిరి కొందరయ్యయో,
పాడు దినంబు లయ్యె భగ
వంతుఁడెరుంగు నతండెసాక్షి మా,
కీఁడవొలంగు నింక చన
వే క్షయవత్సరమా పిశాచమా.

25—ఉ॥ లోపము లేని శైలునకు
లోపముజూప దలంచి తూనికల్,
కోపులు వేసి దోసము ఘ
టించి వితండము లాడికూలిలో,
నోపినయంత లాగికొను
చుండిరి వర్తకు లెల్లనీవు మా,



ద్వీపము జేరబట్టి చన
వే క్షయ వత్సరమా పిశాచమా.

26—చ॥ క్షయయను పేరునీకతగు
త్స్నస్థలిజొచ్చిన నాటఁగోలె ని,
శ్చయముగు వాన లేదుకల
సస్యములెల్లనుమాడె బేరముల్,
క్షయముగు చుండె సక్రమము
గాభవదీయ ప్రవర్తనంబు మ్మ,
త్యయుతముగా గనంబడెనో
హాక్షయ వత్సరమా పిశాచమా.

27—ఉ॥ వంతలదీర్పగా ప్రభవ
వత్సరముల్లదె వచ్చుచుండెనా,
శాంతములందు షట్పద ప్ర
చారము దోచుచు నుండె నింబమా,
ద్యంతము పుష్పసంతతుల
నర్మిలిదాల్చుచు నుండె గానమా,
పొంతజరింపక న్వేడలి
పో క్షయ వత్సరమా పిశాచమా.

చంపకమాల:—— నతివిగదా సులాకను పి
నాంగికొళంబిని సింగపూర్ జనిం,
చితివిగదా యథేశ్చబర
సీమలనెల్లను నీవెయాక్రమిం,
చితివిగదా దరిద్రదశ
జెంది సుఖంబులు గల్గజేసిమిం,
చితివిగదా నిరంతరము
సేవకులట్లు ప్రజాళినెల్లనాం,
చితివిగదా కుబేరులయి
చెన్నలరారెడి వారినేవరిం,
చితివిగదా నుతింపదగు
సేద్యముసైతము గ్రిందుసేయనెం,
చితివిగదా ప్రభుత్వమున
జెట్టజనించిన వేళలోగృశిం,
చితివిగదా నవీనముగ
జేకొనుభీరుల జిక్కులోనముం,
చితివిగదా ధరింపను భు
జింపనుగల్గని పేదనేడిపిం,
చితివిగదా ప్రవీణులగు



శ్రేష్ఠుల గ్రమ్మఱ నంతలోనగిం,
చితివిగదా సమస్తమగు
చేలములం ద్రుటిలోన విక్రయిం,
చితివిగదాని గూఢముగ
జేర్చినద్రవ్యము గూడస్వీకరిం,
చితివిగదా దరిద్రుగృహ
సీమలనైనను వేనవేలు నిం,
చితివిగదా క్రమంబున వి
చిత్రముగా జెలరేగివేసళిం,
చితివిగదా క్షణక్షణము
చిక్కులు గూర్చుచు నాణెముఁ హారిం,
చితివిగదా తెగించి దరి
జేర్చినయంత దివాలనామముం,
చితివిగదా ప్రమోదమున
జేలములల్లడి వారినేర్చికుం,
చితివిగదా తరాజుపయి
జేరిగిరాకిన డంచియేముగిం,
చితివిగదా గణింపదగు
చేలముసైనను జూడకద్దగిం,

చితివిగదా మహోభయము
కెందగనెల్లర పస్తుపెట్టి పోం,
చితివిగదా ప్రజావితతి
క్షేమము నెంచక మూలనంతరిం,
చితివిగదా నిరాదరుల
చెంగటకుత్సిత విద్యనభ్యసిం,
చితివిగదా దురాగతము
జేయబదంపడి మాయలన్ధరిం,
చితివిగదా నిమేషమును
ఛిద్రములన్గనునింప నుద్యమిం,
చితివిగదా ప్రపంచమున
జెడ్డయశంబును నామమున్గడిం,
చితివిగదా ధనంబును గ్ర
సింపను మానుష వృత్తిత్రోజరిం,
చితివికదా బతేకవిలి
చెల్లునె యీక్షయ వత్సరంబునన్.

సమాప్తము.

సర్వేషాం సమస్త సన్మంగళాని భవంతు.



